# తత్త్వఘంటాశతకము

కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతిముని విరచితము.



తెలుగు తాత్పర్యములు :

గుంటూరు లక్ష్మీకాంతముచే

సమకూర్చబడెను.



వికారి

1959

వెల : 50 న.పై.

*Published by*

G. L. KANTAM,

*Yellamanchili,* (VISAKHA DISTRICT).

*With the kind permission of the copy-right holder*

**SRI D. S. VISHWAMITRA,** B. A, LLB.,

SIRSI (*North Kanara Dt*)



ప్రతులు వలయువారిదిగువ అడ్రసుకు వ్రాయవలెను :-

1. గుంటూరు లక్ష్మీకాంతము, యలమంచిలి (విశాఖ జిల్లా) లేదా

2. **J. G. K. MURTY,** *20 Prithivi Avenue, Teynampeta, Madras-*

# తత్త్వఘంటాశతకము

కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతిముని విరచితము.



తెలుగు తాత్పర్యములు:

గుంటూరు లక్ష్మీకాంతముచే

సమకూర్చబడెను.



వికారి

1959

వెల : 50 న.పై.



కావ్యకంఠ వాశిష్ఠ శ్రీ గణపతిముని

# మనవి మాట.



శ్రీ గణపతిముని చరిత్రను నేను రచించి, దానికి నాయన యను పేరిడి క్రీ. శ. 1958 సం॥ మార్చి నెలలో నచ్చొత్తించితిని. దానిని విక్రయించగా వచ్చు లాభముతో శ్రీ గణపతిముని యొక్క యముద్రిత గ్రంథములను క్రమక్రమముగా ప్రచురింపబూని తొలిపుష్పముగా 'మహావిద్యాది సూత్రావళి' యను పేరున కొన్ని సూత్రగ్రంథముల సంపుటిని నేను 1958 సం॥ డిశంబరులో వచ్చిన గణపతిముని జన్మదినమునకు ప్రచురించితిని. పిమ్మట ద్వితీయ పుష్పముగా నీ తత్త్వఘంటా శతకము నీ సంవత్సరమున వచ్చు జన్మదినమునకు సరిగా ప్రచురించ గల్గితిని.

ఈ తత్త్వఘంటాశతకమును 1912 సం॥లో బడఖాండేశ్వరమను బలరామక్షేత్రమందు కొందఱు మఠాధిపతుల కోర్కెననుసరించి శ్రీ గణపతిముని లాఘువున నొకగంటలో చెప్పిన విషయము వారి చరిత్ర నుండి పాఠకులు గ్రహింతురు గాక. భగవాన్ శ్రీ రమణ మహర్షి కత్యంత ప్రీతిని గూర్చిన యీ తత్త్వశతకము యొక్క ప్రాశస్త్యమును గుఱించి వేఱుగా చెప్పనక్కరలేదు. శ్రీ రమణమహర్షి రచనలలో 'ఉపదేశసార' మను గ్రంథము మహర్షి యుపదేశమును వివరించునట్లే పూర్వాచార్యులయొక్క వివిధోపదేశములయొక్క సమన్వయము నీ గ్రంథము జూపునని కవియే చివరి శ్లోకములందు పేర్కొనెను. అట్టి యీ గ్రంథముచే మతములందు భేదదృష్టి నశించుగాక.

వికారి సం॥ కార్తిక బహుళాష్టమీ
మఖానక్షత్రయుక్త సోమవారము
(23-11-1959.)

- గుంటూరు లక్ష్మీకాంతము.

# తత్త్వఘంటాశతకము



శ్లో॥ యం విదుర్ధవలం కేశం హరే రతుల తేజసః ।
యః ప్రలమ్బాసురం హత్వా చక్రే లోకస్య మంగళమ్ ॥ 1

తా॥ ఎవనిని అతుల తేజస్సుగల విష్ణువుయొక్క ధవళవర్ణమైన కేశమనియు (అనగా విష్ణుకేశమే యవతరించి యతడైనట్లు ప్రసిద్ధి), ప్రలంబాసురుని జంపి లోకమునకు మంగళములను గూర్చిన వాడనియు పండితులు చెప్పుదురో, (కేశమా కాశమునకు సంజ్ఞయని గ్రహించినచో అజ్ + కాశతే= అంతటను ప్రకాశించునది యను ధాత్వర్థమునుబట్టి ధవళకేశమనగా ధవళమైన లేదా పరిశుద్ధమైన తేజస్సగును.)

శ్లో॥ బలేన విస్మితా యస్య పృథివీ సచరాచరా ।
కృష్ణస్యాపిచ పూజ్యో యో బభూవాగ్రజతాం గతః ॥ 2

తా॥ చరాచరములతోగూడిన పృథ్వి యెవని బలమునకు విస్మయము జెందెనో, కృష్ణున కెవడు అన్నయై పూజ్యుడయ్యెనో,

శ్లో॥ సంకర్షణస్యాంశ మనన్తశక్తి మనంతనామా నమముం నమామి ।
రామంతృతీయం రమణీయగాత్రం రమానివాసానన పుండరీకమ్॥ 3

తా॥ సంకర్షణుని యంశగలవాడును, అనంతశక్తిమంతుడును, అనంతుడను పేరుగలవాడును, రమణీయమైన శరీరముగలవాడును, లక్ష్మికి నివాసమగు పద్మమువంటి ముఖముగలవాడును అగు బలరామునకు నేను నమస్కరింతును.

శ్లో॥ అథ తత్త్వం ప్రవక్ష్యామో యస్య జ్ఞానా ద్విముచ్యతే ।
ఇహ మన్దమతి ర్మర్త్య స్తితీర్షు ర్భవసాగరమ్॥ 4

తా॥ పిదప మేము తత్త్వమునుచెప్పుచున్నాము. ఏతత్త్వజ్ఞానమువలన భవసాగరము దాటనిశ్చయించిన మందబుద్ధిగల మనుజుడిచ్చటనే విమోచన బొందునో అట్టి తత్త్వము జెప్పుదుము.

శ్లో॥ కరపాదాది సంయుక్తో యోఽయం దేహః ప్రదృశ్యతే ।
కిం సోఽహ మథవా ప్రాణః కించేతః కిముతేతరేత్ ॥ 5

తా॥ హస్తపాదములు మొదలగువానితో గూడిన యే యీదేహ మగ పడుచున్నదో అదియే నేనా? లేక నేను ప్రాణమునా? లేక చైతన్యమునా? లేక మఱి యింకొకటినా ?

శ్లో॥ అహం కుత స్సమాయాతో గమిష్యామిచ కుత్రవా ।
స్వతన్త్రః పరతన్త్రో వా దాసో వాంశః స ఏవవా ॥ 6

తా॥ నేనెక్కడనుండి వచ్చితిని, యెక్కడకు పోయెదను? నేను(వచ్చుటకు పోవుటకు) పరాధీనుడనైన దాసుడనా లేక స్వతంత్రతగల భగవదంశనా?

శ్లో॥ విభూతయః కతీశస్య యాభిర్వ్యాప్తమిదం జగత్ ।
కృతా ఇత్యాదయః ప్రశ్నా జిజ్ఞాసుభి రనేకశః ॥ 7

తా॥ ఈశ్వరుని యొక్క యే విభూతులవలన నీజగత్తు వ్యాపించెనో, ఆవిభూతులెన్ని ? యను నిట్టి ప్రశ్నలనేకములు జిజ్ఞాసువులచే నడుగబడుచున్నవి.

శ్లో॥ ఉత్తరాణితు దత్తాని తైస్తైః ప్రాజ్ఞైః పృథక్పృథక్ ।
తేన సంకీర్ణ మతయో భవన్త్యపి మనీషిణః ॥ 8

తా॥ ప్రత్యుత్తరము లాయా ప్రాజ్ఞులచే భిన్నభిన్నములుగా చెప్పబడెను. అట్టి భిన్నభిన్నబోధలచే విద్వాంసులు సైతము సందేహము బొందినవారైరి.

శ్లో॥ ఏవం తత్త్వే విప్రకీర్ణే తైస్తైరాచార్య భాషితైః ।
వదామ ఏకం నిర్ధార్య యచ్ఛ్రేయో యచ్ఛ్రుతం పరమ్ 9

తా॥ అయా ఆచార్యుల భాషణములచేత తత్త్వ మీవిధముగా ననిశ్చితమై యున్నందున మేమొక నిర్ధారణను జేసి, యేది శ్రేయస్కరమో, యే శ్రేష్ఠమైనది మాకు శ్రుతమయ్యెనో దానిని చెప్పుదుము.

శ్లో॥ ప్రకాశమానా భూతేషు సర్వావస్థాసు సర్వదా ।
సర్వోత్తమా విజయతే చిదేకా సర్వమంగళా ॥ 10

తా॥ భూతములందన్ని యవస్థలలో నిత్యప్రకాశమానమైనది, సర్వోత్తమమైనది, సర్వమంగళప్రదమైనది యగు నొకానొక చిత్తు భాసించుచున్నది.

శ్లో॥ యశ్చ భాస్కర బింబస్థః పరమాత్మా సమీరితః ।
హృదయే యోఽస్మదాదేశ్చ భేదాభావ స్తయోః శ్రుతః 11

తా॥ ఏపరమాత్మ భాస్కరబింబస్థమైనట్లు చెప్పబడునో, ఆపరమాత్మ మన హృదయస్థమైనట్లును చెప్పబడును. ఆరెండింటియొక్క భేదాభావము (అనగానభేదము) నిట్లు వినుచుంటిమి (ఆత్మకు శ్రేష్ఠప్రాణమే కార్యరూపోపాధి. దానితోడనే భాస్కరబింబమును, హృదయమును బొందును.)

శ్లో॥ పరమస్యచ జీవస్య భేదశ్చేత్ ఖభువోరివ ।
ఆత్మత్వముభయో స్సిద్ధ్యే త్సంతతైకాన్వితం కథమ్ ॥ 12

తా॥ ఆకాశమునకు పృథ్వికి గల భేదమువంటిది పరమాత్మకు జీవునకు నున్న దనినచో, పైని చెప్పబడిన సూర్యబింబహృదయములు రెండింటికి నేకాన్వితమగు నాత్మత్వమెట్లు సిద్ధించగలదు ? (అది సిద్ధించుట కిక్కడ భేదము చెప్పరాదని భావము)

శ్లో॥ ప్రజ్ఞానత్వం శ్రుతం లక్ష్మ బ్రహ్మణః పరమాత్మనః ।
జీవేఽపి దృశ్యతే హ్యేతదస్మిం శ్చైతన్యరూపిణి ॥ 13

తా॥ పరమాత్మయైన బ్రహ్మకు ప్రజ్ఞానమను సంజ్ఞను (పేరును) వినుచుంటిమి. మనయందుండు జీవునియందును నట్టి చైతన్యరూపముగల ప్రజ్ఞానత్వము దర్శింపబడుచున్నది కదా.

('ప్రజ్ఞానం బ్రహ్మ' మను ప్రమాణవాక్యము చెప్పున ధర్మిభూతమగు బ్రహ్మ ప్రజ్ఞానమగుటవలన జ్ఞానమతని ధర్మమగును. అట్టి ధర్మమువలన ధర్మిభూత చైతన్యమేది స్ఫురించునో, అది ప్రతి ప్రాణియందును'అహమ్మహ'మ్మను

చైతన్యరూపమున భాసించుచు, తల్లక్షణముచే ప్రాణరూపుడైన జీవునియందు ప్రాణమూలముగా బ్రహ్మను ప్రచురించుచున్నది. కనుక నీలక్షణము నెఱిగి, దాని మూలము నరయు జీవులకా మూలమందు తమ స్వరూపము ప్రజ్ఞానమే యని విదితమగును. ఈలక్షమూలమున తాను ప్రజ్ఞానమై యుండగా, లక్షణ మును బొంది, 'అహమ్మహ' మ్మను వృత్తిరూపమున స్ఫురించు నుపాధిరూప మగు ప్రాణమే తాననుకొనుట జీవలక్షణము. ఈభ్రాంతి తొలగినప్పుడు జీవాత్మ పరమాత్మల కభేదము సిద్ధించును)

శ్లో॥ యది సిద్ధాన్తతోభేదో జీవాత్మ పరమాత్మనోః ।
తత్త్వమస్యాది వాక్యానా మర్థశ్చాప్యనృజుర్భవేత్ ॥ 14

తా॥ అట్లుగాక జీవాత్మ పరమాత్మలకు భేదము సిద్ధాంతము చేసిన యెడల 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములయొక్క అర్థమనృతమై పోవును.

శ్లో॥ ఈశ్వరం జగురాత్మాన మృషయో మంత్రదర్శినః ।
వామదేవాంభృణీ గాధిపుత్ర ప్రభృతయోఽనఘాః ॥ 15

తా॥ మంత్రద్రష్టలు, అనఘచరితులునగు వామదేవ, అంభృణి, విశ్వా మిత్రాది ఋషులాత్మ నీశ్వరునిగా బల్కిరి.

శ్లో॥ యావద్దేహే స్వ విభ్రాంతి స్తావద్భిన్నోఽహ మీశతః ।
యదాత్మానం విజానామి తదా సోఽహం న సంశయః ॥ 16

తా॥ ఎంతపర్యంతము దేహమే యాత్మయను భ్రాంతి జెందుచుంటినో అంత పర్యంతము నేనీశ్వరునికంటె భిన్నుడనగుచుంటిని. 'నేను, నే'నని స్ఫురించుచున్న ఆత్మయొక్క యదార్థరూపము నెప్పుడు తెలియుదునో, అప్పుడు నేనదియై యుందును. సంశయములేదు.

శ్లో॥ అంతర్యామిణ మీశానం వదన్త్యన్యేపి తద్విదః ।
తన్మతే హృదయస్యైవ జీవత్వం పరికల్పితమ్ ॥ 17

తా॥ మఱికొందఱు తత్త్వవేత్త లీశ్వరుని అంతర్యామిగా జెప్పు చున్నారు. వారి మతమందు జీవత్వము హృదయమునకు కల్పితమయ్యెను. (అది దోషమనిభావము.)

(దేహము నాశ్రయించియుండు పంచప్రాణములు వృత్తి రూపములగు విభూతులై యాత్మకుపాధియగు శ్రేష్ఠప్రాణము వలన చైతన్య లాభమును బొంది చలించుచున్నవి. అట్టి శ్రేష్ఠప్రాణరూపముచే నీశ్వరుడు సకల ప్రాణ శరీరములం దంతశ్శరీరివలె నున్నందున నంతర్యామి యనబడెను. ఇదియే 'అహమ్మహ' మ్మని స్ఫురించునట్టిది. శరీరములందది స్ఫురించుటకు హృదయమను దహరాకాశ మాయతన మగుచున్నది. (అనగా యంత్రము). కనుక శరీరమునకు నాత్మకు నడుమ నంతర్యామియై వ్యవహరించు శ్రేష్ఠ ప్రాణమునకు జీవత్వాహంకారము జెప్పవలెనుగాని హృదయమునకు జెప్పరాదు.

శ్లో॥ అంతర్యామీ స్వయంజీవః శంకరేణాభి భాషితః ।
ఏవం తత్త్వే సువిజ్ఞాతే కలహః కోను విద్యతే ॥ 18

తా॥ అంతర్యామియైనవాడే స్వయముగా జీవుడగుచున్నట్లు శంకరా చార్యుడు చెప్పెను. అతడా విధముగా తత్త్వమును స్పష్టము జేసి నప్పుడు కలహమేల ?

(అనగా జీవేశ్వరులకు భేదమును బల్కు కలహమునకు తావులేదని 14వ శ్లోకముతో నన్వయించుకొనవలెను. అట్లే యాత్మ స్ఫూర్తినిచ్చు శక్త్యాయ తనమువంటి హృదయమాత్మ ప్రకాశమునకు దేహమందు, విశ్వమందు గూడ స్థానమగుచున్నప్పుడు దానికి జీవత్వమారోపించి కలహించుట తగ దనియు నన్వయించుకొనవచ్చును.)

శ్లో॥ తస్మాత్కశ్చిన్నావమాన్యో యస్యేశో హృదిరాజతే।
ఆత్మనః పరమం స్థానం హృదయం గీయతే బుధైః ॥ 19

తా॥ ఆత్మకు హృదయమే శ్రేష్ఠమైన స్థానమని పండితులు గానము చేసిరి. అందువలన నీశ్వరుడెవనియొక్క హృదయమందు బ్రకాశించు చున్నాడో, అట్టి మనుజునకెట్టి యవమానము సల్పరాదు.

శ్లో॥ హృదయం యంత్రసంకాశ మాత్మా విద్యుత్సమో మతః ।
ఆత్మనో హృదయేచేష్టా యంత్రే చేష్టాచ విద్యుతః ॥ 20

తా॥ హృదయము యంత్రమువంటిదనియు, యంత్రమును బొందు విద్యుత్తువలె నాత్మ దానిని బొందియున్నదనియు భావించవలెను. యంత్రమందు విద్యుత్తునకు చేష్టయగుచున్నట్లే హృదయమందాత్మకు 'అహమ్మహ' మ్మను చైతన్యాభిమాన చేష్టయగుచున్నది. (ఒకానొక చిత్ప్రకాశముచే 'నహమ్మహ' మ్మను శబ్దచైతన్యము స్ఫురించుటయే యీ చేష్ట)

శ్లో॥ అస్మాకం హృదయం ప్రోక్తం జీవస్యాయతనం మహత్ ।
సూర్యస్యమండలం ప్రోక్త మీశస్యాయతనం మహత్ ॥ 21

తా॥ మనయొక్క హృదయమండలము జీవచైతన్యమునిచ్చు నాయతనమగు మహత్తనియు, సూర్యమండల మీశ్వరచైతన్యము నిచ్చు నాయతనమగు మహత్తనియు చెప్పబడుచున్నది.

('అహమ్మహ'మ్మను ప్రాణవృత్తిరూపులమై మనము జీవుల మగుచుంటిమి. అట్టి వృత్తిని బ్రకాశింపజేయుచు దానియం 'దహమ్మహ'మ్మను చైతన్యమును స్ఫురింపజేయు మహత్తు లేదా తేజమే హృదయము. అదియే యీశ్వర చైతన్యము నిచ్చు నాయతనమగుచున్నది. పిండశరీరమును బొందిన మనయందు జీవచైతన్యము నిచ్చు హృదయమువలె బ్రహ్మాండమందీశ్వర చైతన్యము నిచ్చు సూర్యమండలమున్నదని తాత్పర్యము. అనగా సూర్యమండల మీశ్వర హృదయమని భావము. రెండు పక్షములందును చైతన్యమున కాయతనమగు మహత్తు చిచ్ఛక్తి స్వరూపమై 'అహమ్మహ' మ్మను నభిమానవ్యాపారమును రెండు విధములుగా స్ఫురింపజేయుచున్నది. ఎట్లనగా, నీశ్వరపరమైన అభిమానముచే సూర్యునియందు స్ఫురించుచు, వృత్తిపరమైన అభిమానముచే జీవుని యందు స్ఫురించుచున్నది కావుననే వృత్తినుండి యుపసంహరింపబడి, యాత్మగతమైన అభిమానముచే జీవుడీశ్వరలక్షణము బొందుననని చెప్పబడును.)

శ్లో॥ త్రయస్తు దేవతా శ్రేష్ఠా స్సర్వవేద ప్రభాషితాః ।
తత్రాగ్నిం ప్రథమం విత్తయో భూలోకపతిః స్మృతః ॥ 22

తా॥ ముగ్గురు దేవతలే సర్వవేదములందును శ్రేష్ఠులుగా చెప్పఁబడిరి. వారిలో భూలోకపతిగా నేయగ్ని దైవము స్మరింపబడునో, అతను మొదటివాడని తెలియుడు.

(పంచభూతసిద్ధాంతులాకాశవాయువులనుగూడ మహాభూతములుగా పేర్కొనిరి. ఇది నవీనులమతమై ఛాందోగ్యశ్రుతికి విరుద్ధముగా నున్నది. ఛాందోగ్యశ్రుతియందు తేజోఽబన్నములు మూడే మహాభూతములుగా పేర్కొనబడినందున శ్రుతిననుసరించి యీకవి యాకాశమును పరమాత్మ యొక్క వ్యాపకత్వ చిన్మహిమగను, దానిచే విషయలక్షణముగా వ్యాప్తమైన చిద్రజమును వాయువు లేదా శ్రేష్ఠప్రాణరూపముగను వేఱొక గ్రంథమందు పేర్కొని, యీ శ్రేష్ఠప్రాణమే పరమాత్మకు సగుణ సృష్టికొఱకుపాధియైనట్లు వర్ణించెను. దీనియందే 'అహమ్మహ'మ్మను చైతన్యముతో భాసించుచు నాదాత్మ యధిష్ఠించి, విశ్వాధ్యక్షరూపమును వహించినట్లును పేర్కొనెను. ఈ నాదాత్మచే శ్రేష్ఠప్రాణమందు సంభవించు ధమనము వలన శ్రేష్ఠప్రాణములోని కొంతభాగ మణువులుగా విడిపోయిన సూక్ష్మవస్తుభూతమై, భూతాకాశనామము గలదయ్యెను. త్రివిధములైన అణువులుగా వ్యాపించిన భూతాకాశ వస్తులక్షణమే మూడు మహాభూతములుగా వ్యాపించి, త్రివిధగోళములకు కారణవస్తువునిచ్చు కోశములవలె మూడులోకములయ్యెను. భూర్భువస్సువర్లోకములనబడు నీమూడింటి నధిష్ఠించిన విశ్వాధ్యక్ష విభూతిరూపులు ముువ్వురును శ్రేష్ఠులు.)

శ్లో॥ ఇంద్రం ద్వితీయం జానీత భువర్లోకపతిస్తు యః ।
వాయోశ్చేంద్రస్య తుల్యత్వాద్వాయుర్వాత్ర ద్వితీయకః ॥ 23

తా॥ భువర్లోకపతియని యే యింద్రుని తెలియుచున్నారో, అతడు రెండవ దైవము. ఈయింద్రునితో వృత్తి వాయురూపునకు (మరుత్తునకు) గల తుల్యత్వము వలన ద్వితీయదైవమును వాయువనియు చెప్పుకొనవచ్చును.

(జలాణుమయ వస్తుభూతాకాశము భువర్లోకమగును. ఈయణుభూతమునకు జీవనాణుభూతమని, రసనాణుభూతమని, చిత్తమాణుభూతమని పేర్లు.

తేజోబన్నముల మూడింటిలో నడుమనున్న యీచిత్తమాణువుదెుక్క యంత ర్గుహాయందు శ్రేష్ఠప్రాణము వ్యష్టిశరీరములందావేశించుటను బట్టి సమష్టి యందును మధ్యమ దైవమనబడు నింద్రుడీ 'అప్' భూతమందు తన సహజ లక్షణముచే నావేశించునట్లెంచబడినందున దాని యధిదైవమునుగూడ ఇంద్ర నామముతో బిలచినట్లూహించవచ్చును. అట్లే చిత్తమాణుభూతము శ్వాసవంటి ప్రాణరూపమగుట వలన దానిని వాయు (శ్రేష్ఠప్రాణ) నామముతో బిలచి యుండవచ్చును. వ్యత్యాసము తెలియుటకు వృత్తిరూపవాయువును ప్రాణ మనియు, దానికాశ్రియమగు నంతరిక్షవాయు మండలమును శ్రేష్ఠప్రాణ మనియు పేర్కొనుట ఉచితము. అట్లే భువర్లోకాధిష్ఠాన విభూతి నింద్రు డనినచో, మధ్యముడనబడు త్రిలోకాధిపతిని మహేంద్రుడనవలెను.)

శ్లో॥ తృతీయస్సవితా ప్రోక్తః స్వర్లోకస్యాధినాయకః ।
ఉతాహో ఇంద్ర ఏవైకో దేవ స్త్రిజగతః పతిః ॥ 24

తా॥ స్వర్లోకమున కధినాయకుడైన సవితృడు తృతీయదైవమనబడు చున్నాడు. లేక, (ముల్లోకములకు నధిదైవములు అగ్నీంద్రరవులని యిట్లు చెప్పబడుచున్నను), ఇంద్రుడను దైవమొక్కడే త్రిలోకాధిపతి యనదగును. (దీనినిబట్టి త్రిలోకాధిపతియైన మహేంద్రుని విభూతులు వేర్వేఱుగా మూడు లోకములందు వాక్ప్రాణబుద్ధిదైవములుగా చెప్పబడినట్లు స్పష్టమగును.)

శ్లో॥ తేజస్తు దివితస్యైవ భజతే సూర్యరూపతామ్।
పృథివ్యామగ్ని రూపత్వం హృదయేచాత్మరూపతామ్ ॥ 25

తా॥ అట్టి యింద్రుని తేజస్సే దివియందు సూర్యరూపమును, పృథ్వి యందగ్నిరూపమును, హృదయమందాత్మరూపమును బొందుచున్నది. (ఈ మూడవది మఱల నింద్రత్వమే)

శ్లో॥ తేజోబహిర్గతం ప్రాహు రగ్నీంద్ర రవిరూపకమ్ ।
తదేవాంతస్సమావిష్ట మాత్మేతి పరిగీయతే ॥ 26

తా॥ బాహ్యమందు వ్యాపించిన తేజస్సు నగీంద్రరవిరూపకమనిరి. అంత ర్యమును బొందినప్పుడదియే ఆత్మరూపముగా గానసుచేయబడుచున్నది.(అనగా

నాంతర్యముచే మూలరూపమగుచున్న యీ తేజము బాహ్యమునుబొంది-అనగా నింద్రియగోచరమగుచు- త్రిలోకములందు స్థానభేదమువలన త్రిదైవము లగుచున్నదని ఫలితార్థము. తరువాతశ్లోకములందీ తేజము వ్యష్టియందు రెండుశాఖలైనట్లే సమష్టియందును రెండుశాఖలై యింద్రియ విభూతులగుట చెప్పబడును.)

శ్లో॥ ఆదిత్యానాం ద్వాదశానాం జ్ఞేయా దైవతరూపతా।
ఏకాదశానాం రుద్రాణం విజ్ఞేయా ప్రాణ రూపతా॥ 27

తా॥ ద్వాదశాదిత్యులు ప్రకాశాంశయగు బుద్ధిరూపులనియు, నేకాదశరుద్రులు శబ్దాంశయగు ప్రాణరూపులనియు తెలిసికొనుడు. (మూలశబ్దము, దశేంద్రియములందు క్రియారూపములైన దశవిధశబ్దవృత్తులు కలిపి యేకాదశరుద్రులయ్యెరి. వీనితోగూడి వీనిని బ్రకాశింపజేయుబుద్ధి, కేవలమైన బుద్ధి కలిపి ద్వాదశాదిత్యులయ్యెరి.)

శ్లో॥ వసూనాం గీతమష్టానాం లోకాత్మత్వం మనీషిభిః
ఏతే త్రయో దేవగణాః సకలాగమ సమ్మతాః॥ 28

తా॥ అష్టవసువులకు— అనగా ఆపుడు, ధృవుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు అను వారికి— లోకరూపత్వమును (అనగా బుద్ధిప్రాణములకు విషయోపాధి వస్తువై లోకములనెడి కోశములుగా వ్యాపించు చిత్తవస్తురూపత్వమును) పండితులు గానముచేసిరి. ఇట్లీ యాదిత్య రుద్రవసువులు ముగ్గురును దేవగణములని సకలాగమము లంగీకరించిన విషయమే. (వీరుసృష్టికర్తకు బుద్ధి ప్రాణచిత్తములై యంతఃకరణ స్వరూపులగుదురని భావింపవలెను. మనస్సు ప్రాణముయొక్క, బుద్ధియొక్క మిశ్రమము గాపున దానినివిడచి త్రిప్రకారముగానున్న యీ అంతఃకరణముచే సృష్టికర్త అధ్యాత్మ-అధిదైవిక-అధిలోకవ్యాపారముగా స్ఫురించుచున్నట్లు తరువాత శ్లోకములో చెప్పబడుచున్నది.)

శ్లో॥ వసవస్త్వధిలోకం స్యురాదిత్యాస్త్వధి దైవతమ్।
అధ్యాత్మ కీర్తితా రుద్రాస్తత్త్వవిద్భిర్విచక్షణైః॥ 29

తా॥ అధిలోకరూపముచే వసువులు, అధిదైవతరూపముచే నాదత్యులు, అధ్యాత్మరూపముచే రుద్రులు అను దేవగణములైనట్లు తత్త్వము నెఱిగిన పండితులు కీర్తించుచున్నారు.

శ్లో॥ 'ఆదిత్యానామహం విష్ణు' రితి కృష్ణ స్మృతిః స్వయమ్।
తస్మాదాదిత్య ఏవాయం యోఽసౌ విష్ణుః ప్రగీయతే॥ 30

తా॥ 'ఆదిత్యానామహం విష్ణుః' అని భగవద్గీతలో కృష్ణుడు స్వయముగా చెప్పెను. (అర్థము:- ఆదిత్యులలో నేను విష్ణువును, అనగా ద్వాదశాదిత్యులలో విష్ణువను పేరుగల ఆదిత్యుడను. ఈ యాదిత్యరూపము మిగిలిన పదునొకండుగురికంటె శ్రేష్ఠమై, మూలకందమువంటిది)అందువలన ఏ విష్ణువట్లు చెప్పబడెనో, ఆ విష్ణునామక ఆదిత్యుడే పై శ్లోకములో వివిధాదిత్యరూపములచే నధిదైవతమైనవాడు. (ఈ ద్వాదశాదిత్యు లెట్లు మహేంద్రుని క్రిందియవిభూతులగుచున్నారో కవి దిగువను వివరించుచుండెను.)

శ్లో॥ పాణీంద్రియం యదీశస్య లోకశిల్ప విచక్షణమ్।
త్వష్టారం దైవతం తస్య మునయస్సంప్రచక్షతే॥ 31

తా॥ లోకశిల్పనమందు సమర్థమైన యీశ్వరుని పాణీంద్రియమేదియో, ఆయింద్రియమునకు సంజ్ఞయైన బుద్ధిలక్షణరూపము త్వష్టయని మునులు చెప్పుచున్నారు. (దివ్ =ప్రకాశించుట కనుక దైవగణమును బుద్ధిగణముగా నెంచవలెను.)

శ్లో॥ వేదస్యమాతా శబ్దాత్మా పావనేభ్యశ్చపావనీ।
యావాక్సమస్త నాథస్య తద్దేవో బ్రహ్మణస్పతిః॥ 32

తా॥ వేదమునకు మాతయై, ప్రణవమను శబ్దరూపిణియై, పావనమైనవానికంటెను పావనియై, సమస్తమునకు ప్రభువైన యీశ్వరునీ యే వాక్కువ్యాపించెనో ఆ వాక్కనబడు నింద్రియమునకు సంజ్ఞయైన బుద్ధిగణరూపము బ్రహ్మణస్పతి,

శ్లో॥ స ఏవ సవితా నామ ప్రోక్తః కైశ్చన పండితైః।
భిద్యతే సవితుస్సోఽయం సూర్యమండల వాచకాత్॥ 33

తా॥ ఆబ్రిహ్మాణస్పతిని (లేదా ఆ వాగింద్రియ రూపదైవతమును) కొందఱు సవితా నామముచే పిలిచిరి. కాని యీసవితృడు సూర్యమండల వాచక సవితృనికంటె వేఱు. (ఇతనిని పర్జన్యనామకుడగు నొక ఆదిత్యునిగా గైకొనవచ్చును)

శ్లో॥ యేన సర్వం విసృజతి త్రైలోక్య క్షేమహేతవే।
తత్పాయు రింద్రియం మిత్రస్తద్దైవత ముదీర్యతే॥ 34

తా॥ ఏయింద్రియముచే త్రైలోక్యక్షేమము కొఱకు సర్వము(మాలిన్యము) విసర్జింపబడుచున్నదో, అట్టి పాయురింద్రియ (గుదము) సంజ్ఞయగు దైవతరూపమును మిత్రుడను చున్నారు (ఇతడే అజఘన్యుడు కావచ్చును.)

శ్లో॥ అంతర్యామీతి యస్సర్వ భూతానాం హృదయస్థితః।
జీవో వైశ్వానరం నామ తస్యాంశం దైవతం విదుః॥ 35

తా॥ సర్వభూతముల కంతర్యామివలె నేజీవలక్షణము వైశ్వానర నామముచే హృదయమందు స్థితమైయున్నదో, యీశ్వరస్ఫూర్తుల (అంశువు=స్ఫూర్తి)నిచ్చు నీ దైవతమును పండితులు అంశుమంతుడను చున్నారు.

శ్లో॥ పాదస్సర్వాణి భూతాని యదస్య పరమాత్మనః।
అంశః పాదేంద్రియాధీశ స్తస్మాత్సంసార చాలకః॥ 36

తా॥ పరమాత్మయొక్క పాదము (అంశ) సర్వభూతములయ్యెను. అందువలన సంసారచాలకమగు నీయంశ పాందేంద్రియమున కధీశమగును.

శ్లో. మండలే త్వయమేవాంశో విష్ణురిత్యభిధీయతే।
హృదయే త్వయమేవాంశః ప్రోక్తో వైశ్వానరో బుధైః॥ 37

తా॥ ఈయంశయే (సంసారచాలకాంశ) సూర్యమండలమందు విష్ణువని, హృదయమండలమందు వైశ్వానరుడని పండితులచే చెప్పబడును.

శ్లో॥ నిమించత్యత్ర యద్రేతః సర్వసర్గ ప్రవర్తకమ్।
తల్లింగం పరమేశస్య ధాతా తస్యతు దైవతమ్॥ 38

తా॥ పరమేశ్వరుని యే ఇంద్రియము సర్వసృష్టి కొఱకు ప్రవర్తక మగు రేతస్సును విడుచుచున్నదో, అట్టి లింగేంద్రియము లేదా ఉపస్థేంద్రియమునకు సంజ్ఞయైన దైవతము ధాత (బ్రహ్మ)

శ్లో॥ యేనాదదాతి సకలం రసాది జగతాం ప్రభుః।
ఇంద్రియం రసనాఖ్యం తత్తద్దేవో వరుణోమతః॥ 39

తా॥ ఏయింద్రియముచే సకలమైన రసాదికమును జగత్ప్రభువు గ్రహించుచున్నాడో, రసనాఖ్యమైన ఆజిహ్వేంద్రియమునకు సంజ్ఞయైన దైవతము వరుణుడని పండితుల యభిప్రాయము.

శ్లో॥ యేన జిఘ్రతి భూతేశః సర్వేషాం కర్మవాసనాః।
తద్ఘ్రాణ మర్యమా తస్యదేవో నాన్యస్తతో యమః॥ 40

తా॥ భూతేశు డేయింద్రియముచే సర్వప్రాణులయొక్క కర్మ వాసనల నాఘ్రాణించుచున్నాడో, అట్టి ఘ్రాణేంద్రియమునకు సంజ్ఞయగు బుద్ధి గణము అర్యముడు. ఇతనికంటె యముడు వేఱుకాడు.

శ్లో॥ ఇంద్రియం శ్రవణం నామ యదీశస్య ప్రకీర్తితమ్।
వివస్వదాఖ్య మాదిత్య మామనన్త్యస్య దైవతమ్॥ 41

తా॥ ఈశ్వరుని శ్రవణేంద్రియ నామముగా నేది కీర్తింపబడుచున్నదో దానికి సంజ్ఞయగు దైవతము వివస్వంతుడనబడు నాదిత్యుడని చెప్పుచున్నారు. (ఇతడే వివస్వంతుడను నాదిత్యుడు)

శ్లో॥ దిగ్దేవతాఖ్యా తస్యైవ భవతీత్యనుశుశ్రుమ।
సపుమాన్వనితా సా వా భవేద్దివ్యేతు విగ్రహే॥ 42

తా॥ ఆ వివస్వంతునకు (లేదా శ్రవణేంద్రియమగు దైవతమునకు) దిగ్దేవత యను పేరున్నట్లు వినుచుంటిమి. దివ్యవిగ్రహ మందా దైవతము పురుషుడు కాని స్త్రీ కాని కావచ్చును.

శ్లో॥ విద్యుద్రూపం పరంజ్యోతిః నయనం పరమేశితుః ।
అథవా సకలం జ్యోతి ర్నయనం సంప్రకీర్త్యతే ॥ 43

తా॥ విద్యుద్రూపమైన పరంజ్యోతియే పరమేశ్వరుని నయనము. లేదా, సకలజ్యోతిస్సు అతని నయనమనియు కీర్తింపబడుము.

శ్లో॥ దేవా నామస్మదాదీనాం భూతానాంచ సమన్తతః ।
యద్దృష్టి సాధనం జ్యోతిః సహస్రాక్షోస్య దైవతమ్ ॥ 44

దేవతలకును మనబోటి జీవరూప భూతకోట్లకు నంతటను దృష్టిసాధన మగుచున్న జ్యోతి యేదియో దానికి సంజ్ఞయగు దైవము సహస్రాక్షుడైన ఇంద్రుడు (ఇంద్రుడు ద్వాదశాదిత్యులలో నొకడు)

శ్లో॥ ఇంద్రియాణాం వరం చక్షుర్దేవానాం వాసవో వరః ।
యశ్చక్షుర్వాసవం వేద సవేద సకలం జగత్ ॥ 45

తా॥ ఇంద్రియములలో శ్రేష్ఠమైనది చక్షువు, దేవతలలో శ్రేష్ఠమైన వాడు వాసవుడు (ఇంద్రుడు). అట్టి చక్షువు నెవడింద్రునిగా తెలిసికొనునో వాడు సకల జగత్తును తెలిసినవాడగుగు

శ్లో॥ వృత్రాఖ్యా తమసో జ్ఞేయా శక్రాఖ్యా జ్యోతిషస్తథా ।
తస్మాత్ వృత్రస్య హంతారం శక్రమాచక్షతే బుధాః ॥ 46

తమస్సునకు వృత్రనామము, జ్యోతిస్సునకు శక్ర (ఇంద్ర) నామము తెలియదగినవి. పండితులందువల్లనే వృత్రుని చంపిన వానిగా శక్రుని చెప్పుచున్నారు (వృత్రహా = శక్రుడు)

శ్లో॥ అక్షోరన్త స్సమావిష్ట మాదిత్యం వాసవాత్మకం ।
ధ్యాయన్గ్రంథిత్రయం భిత్వా ప్రయాతి పరమాం గతిమ్ ॥ 47

తా॥ రెండునేత్రముల యొక్క అంతరమందున్న వాసవరూపమైన ఆదిత్యుని ధ్యానించినవాడు గ్రంథిత్రయమును భేదించుకొనుచు పరమమైన గతిని (స్థానమును లేదా స్థితిని) బొందుచున్నాడు.

శ్లో॥ పూషానామ య ఆదిత్యః స త్వగింద్రియ దైవతమ్ ।
శరీర మేష పుష్ణాతి సర్వేషాంచ శరీరిణామ్ ॥ 48

తా॥ పూష నామకుడైన ఆదిత్యుడెవడో అతడు పరమేశ్వరుని త్వగింద్రియమునకు గుర్తైనదైవము. ఆపూషుడే సర్వశరీరధారులకు శరీరమును పోషించుచున్నాడు. (పూషనామము గల దివ్యశరీర మందలి శరీరములందు నుండి యా శరీరములు మనలను పోషించునట్లే వాని నది పోషించుచున్నదని భావము.)

శ్లో॥ భూదేవతాఖ్యా తస్యైవ భవతీ త్యనుశుశ్రుమ ।
సపుమాన్వనితావా సాభవేద్దివ్యేతు విగ్రహే॥ 49

తా॥ ఆపూషునకు (లేదా పోషించు నీశ్వరత్వగింద్రియ రూపదైవతమునకు) భూదేవతయను పేరున్నట్లు వినుచుంటిమి. దివ్య విగ్రహమందది పురుషుడుకాని స్త్రీకాని కావచ్చును. (ఇదియే శ్రేష్ఠప్రాణరూపము యొక్క సర్వేంద్రియాత్మక విభూతి)

శ్లో॥ భగః కీర్తిర్భగో లక్ష్మీర్భగో మాహాత్మ్యముచ్యతే।
భగః కామస్సమాఖ్యాతో భగో రత్నం సమీర్యతే॥ 50

తా॥ భగః అనుశబ్దము కీర్తి, లక్ష్మి, మాహాత్మ్యము, కామము, రత్నము అను విభూతులకు చెప్పబడును.

శ్లో॥ భగ ఏవ స్మృతం వీర్యం యత్నశ్చాపి భగః స్మృతః।
ఏవం విభూతిస్తు భగో మనసః ఖలు దైవతమ్॥ 51

తా॥ మఱియు, వీర్యమునకు యత్నమునకు గూడ భగశబ్దము స్మరింపబడును, అట్టి విభూతులుగల భగుడు పరమేశ్వరుని మనస్సునకు సంజ్ఞయగు దైవతమగుచున్నాడు,

శ్లో॥ చంద్రాభిదానం తస్యైవ భవతీ త్యనుశుశ్రుమ।
సపుమాన్వనితావా సా భవేద్దివ్యేతు విగ్రహే॥ 52

తా॥ అట్టి మనస్సను సంజ్ఞగల దైవతమునకు చంద్రుడను పేరు కూడ వినుచున్నాము. దివ్యవిగ్రహముగదది పురుషుడుకాని స్త్రీకాని కావచ్చును.

శ్లో॥ తద్వన్తం పరమేశానం భగవన్తం ప్రచక్షతే।
ప్రత్యగ్దృశాం మునీనాంచ భగవచ్ఛబ్ద ఇష్యతే॥ 53

తా॥ అట్టి భగముగల పరమేశ్వరుని భగవంతు డనుచున్నారు. మనకంటె ప్రత్యేకమైన దివ్యదృష్టిగల మునులకును భగవచ్ఛబ్దము సమంజసమే.

శ్లో॥ లక్ష్మీః కామశ్చ వీర్యంచ మాహాత్మ్యంచ పృథగ్విధమ్।
సిద్ధానాం జ్ఞానయుక్తానాం ప్రతితిష్ఠన్తి చేతసి॥ 54

తా॥ లక్ష్మి, కామము, వీర్యము, మాహాత్మ్యము కూడ వేఱువిధములుగా జ్ఞానయుక్తులైన సిద్ధపురుషుల చిత్తమందు ప్రతిష్ఠింపబడి యుండును.

శ్లో॥ ఏవం ద్వాదశచాదిత్యా వ్యాఖ్యాతా స్తత్త్వదర్శినా।
ప్రవరేణ వసిష్ఠానాం నారసింహస్య సూనునా॥ 55

తా॥ ఈవిధముగా వాసిష్ఠసగోత్ర నరసింహశాస్త్రికి పుత్రుడును, తత్త్వదర్శనమును బొందినవాడును అగు వానిచే (గణపతి మునిచే) ద్వాదశాదిత్యులు వ్యాఖ్యానింపబడిరి.

(ఈశతక మాశుధారచే గణపతిముని యొక గంటలో రచించి చెప్పినట్లు పీఠికలో వ్రాయబడెను. ఇక్కడ ద్వాదశాదిత్యులను పౌరాణిక విధమునగాక తత్త్వముచే వర్ణించుట పండితులకు క్రొత్తగావచ్చును గనుక ఋషులవలె తా బొందిన తత్త్వదర్శనత్వ మందులకు ప్రమాణమని ధ్వనింపజేసెను. ద్వాదశాదిత్యుల పేర్లు పూష, ఇంద్ర, వివస్వంత, వరుణ, అర్యమ, పర్జన్య, త్వష్ట, విష్ణు అజఘన్య, ధాత, భగ, అంశుమంతులు. వీరిలో చివరి యిద్దరు మనస్సు, జీవరూపాత్మల కన్వయింపబడెను, అన్నమాణువనబడు పార్థివ ప్రాణభూత సంపదను బొందిన బుద్ధిచైతన్యమును మనస్సందురు. ఇది యింద్రియగతమై, యింద్రియములను పోషించుచు, తద్ద్వారమున నాత్మ యొక్క పరాచీ దృష్టియగుచు విశ్వానుభవము బొందించుచున్నది. ఆదృష్టి ప్రతీచీయైనప్పుడు అంశుమంతునివలె నంతరానుభవము బొందించును. మిగిలిన పదిమంది యాదిత్యులు

సూక్ష్మస్థూలేంద్రియములయొక్క ప్రత్యేక ప్రత్యేక వ్యాపారమును, తత్సంబంధజ్ఞానము నర్పించు విభూతులుగను వ్యాఖ్యానింపబడెను. ఈ యింద్రియములన్నియు ప్రాణవంతములై రుద్రాంశను బొందియున్నవి. అవి మూలరుద్రుడైన (ఏకాదశస్థానమున నున్నవాడైన) శేషప్రాణమున కధీనములు. వానిని బొంది, వాని వ్యాపారమును గ్రహించు బుద్ధ్యంశలాదిత్యులైనప్పుడు మూలబుద్ధి పండ్రెండవ ఆదిత్యుడగును.)

శ్లో॥ ఏతేషాం హేతు భూతా యే ప్రాణా ఏకాదశ స్మృతాః ।
భూతాత్మికా స్తా భూతేశ విభూతీః ప్రాహురుత్తమాః ॥ 56

తా॥ ఏకాదశప్రాణము లేవి (అనగా రుద్రులనబడిన నాదాంశలేవి) పూర్వము స్మరింపబడెనో, అవి యీ ఆదిత్యరూపములకు హేతుభూతములుగా నున్నవి. ఆ భూతాత్మికప్రాణముల నీశ్వర విభూతులుగా (అనగా ప్రణవరూప విభూతులుగా) పండితోత్తములు చెప్పుచున్నారు.

శ్లో॥ రుద్రాణాం ప్రాణరూపాణాం సూర్యాణాం దేవతాత్మనామ్ ।
ఏకత్వం యో విజానాతి తత్త్వవేత్తా స ఉత్తమః ॥ 57

తా॥ ప్రాణరూపులు రుద్రులగుచు, తేజస్స్వరూపులు సూర్యులగుచున్నారు. (అనగా నాదరూపులొకరు, నాదముచే ప్రకాశించు తేజస్స్వరూపులింకొకరు). ఎక్కడ వీరికేకత్వమగుచున్నదో తెలిసికొనిన వాడుత్తముడు. (ఈ యిద్దరు ఆత్మచైతన్యమునిచ్చు శక్తియొక్క రెండుశాఖలైనందున 'అహం' భాసమానమైన ఆ చైతన్యశక్తియం దేకమగుచున్నారు. అదియే 'అహం' వృత్తిమూలము. ఆ మూలమందున్న ఆత్మ యుత్తముడనబడును గనుక మూలము నెఱిగిన వాడాత్మరూపుడే తానగుచు నుత్తముడగును. ఇదియే స్వరూపమగుచున్న శుద్ధాకాశమనియు, చిదాకాశమనియు పిలువబడును. దేనిగుహాయం దీపరమాకాశ స్వరూపమున్నదో, ఆబుద్ధితేజము 'అహం' శబ్దాకృతియొక్క ప్రచురయనబడును. ఇది మధ్యమ దైవస్వరూపము. వ్యక్తనాదము నెఱిగించు బుద్ధివృత్తిచే మధ్యమదైవమే ప్రతిసూర్యునియందును ప్రకాశించుచున్నాడు. వ్యక్త తేజముచే ప్రకాశించు నీప్రాణరూపు నగ్నియనియు పిలుతురు)

శ్లో॥ వైశ్వానరస్య స్థానంతు పృథివీ సంప్రకీర్తితా ।
స ప్రోక్తః ప్రథమోదేవో దేవతా తత్త్వవేదిభిః ॥ 58

తా॥ వైశ్వానరునకు స్థానము పృథ్వియని కీర్తింపబడుచున్నది. అతడే ప్రథమదేవుడనియు (అనగా పురుషాకృతిని బొందిన ప్రథముడని భావము) దేవతా తత్త్వవేత్తలు చెప్పుచున్నారు. (అనగా నగ్నిరూపదైవము సూర్యుని యందు సౌరాగ్నియై, పృథ్వియందు పార్థివాగ్నిరూపుడగు వైశ్వానరుడగుచున్నట్లు గ్రహించవలెను.)

శ్లో॥ అస్మాకం పదవన్నైవ విభోః కస్మాస్పదం పదమ్।
జ్ఞానస్యైవ పదాభిఖ్యా ధర్మభూతస్య గీయతే॥ 59

తా॥ విభుడైన పరమేశ్వరున కాస్పదమైన పదము మనయొక్క యంఘ్రిరూపము వంటిదికాదు. అది ధర్మభూతమైన జ్ఞానము (శుద్ధాకాశము) యొక్క భాగముగా (పాదమనగా భాగము) కీర్తింపఃడినపదము. (విభుడనగా వ్యాపకుడు. వ్యాపకత్వముచే పరమేశ్వరుడాకాశరూపుడయ్యెను, అతని ధర్మమగు చిత్తు చిదాకాశము లేదా శుద్ధాకాశమయ్యెను. ఈ యాకాశమునే పరమవ్యోమమనియు, చైతన్యశక్తియనియు కీర్తించిరి. దీనికి లక్షణముగా వ్యాపించిన రజోమయాకాశమే—దీనికే యంతరిక్షమను పేరు—వికృతిసృష్టికి కారణభూతమైనందునదాని నిక్కడ పాదముగా— అనగా అంశ లేదాభాగముగా స్మరించిరి. 'పాదోఽస్య విశ్వభూతాని, త్రిపాదస్యామృతం దివి' అను వేద వాక్యముచే నది సచ్చిదానంద స్వరూపములో నాల్గవవంతుగా వ్యాపించి నట్లగును. దీనినే మధ్యముని లోకమందురు గనుక కవి యిక్కడ మధ్యమ దైవమును స్మరించుటకు దీనిని పేర్కొనినట్లు భావింపదగును.)

శ్లో॥ ఐశ్వరం హృదయే జ్ఞానం సర్వభూతేషు భాసతే ।
తమంశం పార్థివం ప్రాహు స్తథా వైశ్వానరం విదః॥ 60

హృదయమందీశ్వర సంబంధమై ప్రకాశించు జ్ఞానమే సర్వభూతములందును బ్రకాశించునది. (ఇదియే మధ్యమలోకములో 'అహమ్మహ'మ్మను ప్రణవ నాదముగా భాసించు లక్షణమునకు మూలమైయున్న 'అహం' భాసమాన చిదాకాశస్వరూపము. దీనిని స్మరించుటచే నిచ్చట ఉత్తముడనబడు దైవము

పేర్కొనబడినట్లుగును) ఆవిధముగా నొక యంశయేది భూతములందు భూత సంపర్కముచే పార్థివమై ప్రకాశించుచున్నదో, దానిని పండితులు వైశ్వానర దేవతాలక్షణమనుచున్నారు. (వైశ్వానరునకు హృదయమే స్థానము. హృదయమందు శ్రేష్ఠప్రాణమనెడి యంతరిక్షాకాశము నుపాధిగాగొనిన ఆత్మచైతన్య రూపమున్నది. అదియే మధ్యమదైవమైనను, ఉపాధియందభిమాని వైశ్వానరుడగును. శ్రేష్ఠప్రాణమాత్మ చైతన్యమునుబొంది యాత్మవలె నభిమానించి విజృంభించినప్పుడు తేజోఽబన్నత్రివృత్కరణమును, తదితర వికృతసృష్టిని కల్పించినదగుచున్నది. అవిధముగా నుపాధితోగూడి, యుపాధియైన శ్రేష్ఠప్రాణమం దభిమానవశమున పార్థివమగుచున్న జ్ఞానముచేనాత్మ వైశ్వానరుడనబడుచున్నాడు. ఇతడు పరమేశ్వరుని స్ఫురణరూపుడైనందున అంశుమంతుడితడే యని వ్యాఖ్యానింపబడెను- చూడుడు 35శ్లో॥. ఉపాధిత్వమే పార్థివమగుటవల్లను, పార్థివతత్త్వమే పృథ్వియగుటవల్లను నితనికి పృథ్వీస్థానమని 58 శ్లోకములో చెప్పబడినదానిని స్థూలదృష్టిచే పండితులు వచించిన యభిప్రాయముగా గైకొనవలెను, లేదా అతని స్థూలవిభూతిరూపమైన పార్థివాగ్ని వచింపబడినట్లైన గైకొనవలెను. బద్ధదశయందున్న జీవుడు ముక్తదశను బొందుటయే ద్వితీయ జన్మ యనియు, దానిచే జీవుడు వైశ్వానరతత్వము బొందుచున్నట్లును, అదియే కుమారస్వామితత్త్వము లేదా సనత్కుమారతత్త్వమనియు నీకవియే నింకొక స్థలమందగ్నియొక్క నాల్గు విభూతులను వ్యాఖ్యానించుచు చెప్పి నందున ఆత్మపరమైన అభిమానముచే వ్యవహరించు శ్రేష్ఠప్రాణరూపుడు వైశ్వానరుడగునని స్పష్టమగుచున్నది.)

శ్లో॥ బింబే యదైశ్వరం జ్ఞానం దిననాథస్య భాసతే।
దివ్యం తమంశం భాషన్తే తథా విష్ణుం మనీషిణః॥ 61

తా॥ ఆప్రకారముగనే సూర్యుని బింబమందీశ్వర సంబంధమైన యేజ్ఞాన తేజము భాసించుచున్నదో, దివ్యమైన బింబాకారమగు నా పార్థివాంశను విష్ణుదేవతాలక్షణమనుచున్నారు. (ఆకాశము నుపాధిగాగొనిన మొదటి దైవాకృతి వైశ్వానరుడైనట్లే, గోళసృష్టిలో బింబాకృతిని బొందిన మొదటిదైవము విష్ణువు)

శ్లో॥ ఉపాధివశతో గాయన్తుభౌచ పురుషాకృతీ ।
పూర్వస్య ప్రతిబింబో౽న్యః పూర్వః స్యా న్మధ్యమస్యతు ॥ 62

తా॥ ఉపాధివశమువల్లనే వైశ్వానర విష్ణువులుభయులు పురుషాకృతులుగా గానము చేయబడుచున్నారు. మొదటి యాకృతియొక్క బింబమే రెండవ యాకృతి, అట్లే మొదటిది మధ్యమదైవము యొక్క ప్రతిబింబము.

(అవ్యక్త ప్రణవరూపుడు మధ్యమదైవమని పూర్వము చెప్పబడెను. అతని తొలి వ్యక్తరూపమతని ప్రతిబింబమే యగుచు వైశ్వానరుడనబడు ప్రథమ పురుషాకృతి యనబడుచున్నాడు. వ్యక్తమైన విద్యుల్లేఖవంటి తేజమే యితని యాకృతి. శ్రేష్ఠప్రాణము యొక్క యీ తేజస్సు మనబుద్ధి గుహయందంగుష్ఠ ప్రమాణమై యున్నందున, ఆప్రమాణముచే నతనికి బింబాకృతి చెప్పబడుచున్నను, సూర్యులకు మూలమైన యీ వ్యక్తబింబము సమష్టియందు మహాన్త మనవచ్చును. ద్వితీయ ప్రతిబింబము సూర్యబింబమైనను, అదియు బృహద్బింబమే.)

శ్లో॥ సర్వేషామపి భూతానా మన్తరే భాతి యద్యపి ।
వైశ్వానరో౽యం ప్రథమః పృథగ్విగ్రహ వర్జితః ॥ 63

ఆలోచించగా సర్వభూతముల కంతరమై యే పార్థివతేజము భాసించుచున్నదో, భూతముల యొక్క వేర్వేఱు విగ్రహరూపములను విడచి కేవలమై యున్న ఆ (పార్థివతత్త్వ) తేజస్స్వరూపమే వైశ్వానరుడనబడు ప్రథమ పురుషాకృతి యనదగును. (సూర్యుని బింబాకృతి పార్థివతత్త్వమువల్ల గల్గును గావున వైశ్వానరుడే సూర్యునియందు విష్ణునామకుడగును.)

శ్లో॥ తథాపి భువిసంజాతో యో మూలపురుషో మహాన్ ।
తత్రైవ దేవతాఖ్యాతి రభిమాన విశేషతః ॥ 64

తా॥ అట్లైనను, భూమియందు మొదట నరుడుగా పుట్టిన మహానుభావుడెవడో, వానియందభిమాన విశేషమువలన వైశ్వానరదేవతా ఖ్యాతిని కల్పించిరి.

శ్లో॥ త్వచస్తు దేవతా దేవీ యా భూర్నారీ స్వరూపిణీ ।
తస్యాశ్చ పృథివీ స్థానం విజానీత విచక్షణాః ॥ 65

తా॥ త్వగింద్రియ దేవతయగు భూతత్త్వస్వరూపిణియైన నారి యత్ర నికి దేవియగుచున్నది. (పృథ్వీస్థానముగాగల వైశ్వానరునకు.) ఆమెకును పండితులు పృథ్వియే స్థానమనిరి.

( 49 శ్లోకములో చెప్పబడిన భూదేవతయే యీమె )

శ్లో॥ తుషారదీధితేర్బింబం యమస్యస్థాన ముచ్యతే ।
పితౄణామపి సర్వేషాం నాయకస్య ప్రకీర్తితః॥ 66

తా॥ చల్లని కాంతులుగల చంద్రబింబము యముని స్థానమనిరి. సర్వ పితరులకును నాయకుడతడేయని కీర్తింపబడుచున్నాడు.

(సర్వ ప్రాణుల యొక్క కర్మవాసనల నాఘ్రాణించు తత్త్వముచే యముడీశ్వరుని ఘ్రాణేంద్రియ విభూతిగా 40 శ్లోకములో చెప్పబడెను.)

శ్లో॥ విష్ణోర్లక్ష్మీ సమేతస్య స్థానం స్యాత్సూర్యమండలమ్ ।
వైకుంఠమితి తస్యైవ నామ గీతం పరైర్బుధైః ॥ 67

తా॥ లక్ష్మీ సమేతుడైన విష్ణువునకు సూర్యమండలము స్థానమగు చున్నది. ఈ స్థానమునకే వైకుంఠమనుపేరు కొందఱుపండితులచే గానము చేయబడెను.

శ్లో॥ ధాతా సాక్షాత్పరః ప్రోక్తో భక్త్యోక్తిస్తు విభూతిషు ।
సమష్టేరింద్రియం బీజశాలి వస్త్వేవ తత్త్వతః ॥ 68

తా॥ ధాత సాక్షాత్తుగా పరుడని చెప్పబడును. లక్షణభాషచే విభూతు లందు సమష్టికింద్రియమని చెప్పబడును. ధాత వస్తుతత్త్వముచే బీజశాలి యగును. (అనగా విశ్వసృష్టికి వలయు వస్తుబీజము కలవాడు.)

శ్లో॥ అన్యేషాం దైవతానాంతు స్థానం మధ్యమ ముచ్యతే ।
ఏవం స్థానాని యో వేద దేవానాం స కృతీ నరః ॥ 69

తా॥ ఇతర దేవతలకు కూడ మధ్యమలోకము స్థానముగా చెప్పబడు చున్నది. ఆలోకమందుగల దేవతాస్థానముల నెవడు తెలిసికొనునో, ఆ నరుడు కృతార్థుడు. (దశ మహావిద్యలయొక్క రహస్యమిదియే)

శ్లో॥ ఆదిత్యానాం పతిర్విష్ణు ర్వాసవో మరుతాం పతిః ।
పితౄణాం యమ ఈశానః పతిర్వైశ్వానరో విశామ్ ॥ 70

తా॥ ఆదిత్యులకు విష్ణువుపతి, మరుత్తుల కింద్రుడుపతి. పితరులకు యముడు పతి (ఈశాన=పతి), నరులకు (విశాం=నరులకు) వైశ్వానరుడు పతియగుచున్నారు.

శ్లో॥ ఆదిత్యేభ్యో ద్వాదశభ్యో భిద్యన్తే విష్ణుసేవకాః ।
ఆదిత్యా ఉభయేభ్యశ్చ భిద్యతే సూర్యమండలమ్ ॥ 71

తా॥ ద్వాదశాదిత్యులు కంటె విష్ణుసేవకులైన ఆదిత్యులు వేఱు. ఆ యిఱువురికంటెను సూర్యమండలరూపుడైనవాడు వేఱు. (దీనినిబట్టి ద్వాదశాదిత్యు లీశ్వరుని విభూతులగుదురుగాని గోళరూపులుకారనిస్పష్టమగుచున్నది. మండలరూపమునకును ఆ పేరు వ్యవహారమందుండుట యనర్థమయ్యెను )

శ్లో॥ శివస్త్వేకాదశః ప్రాణ స్తత్త్వ దృష్ట్యాం నిగద్యతే ।
ఏషదైవత దృష్ట్యాంతు వాసవా న్నాతిరిచ్యతే ॥ 72

తా॥ ఏకాదశ ప్రాణము శివుడని తత్త్వదృష్టిచే నిర్వచింపబడెను. దేవతాదృష్టిచే చూచినప్పు డతడు వాసవుని (ఇంద్రుని) కంటె వేఱుకాడు.

శ్లో॥ వస్తుతో దేవతైకైకా ప్రతిష్ఠానం ప్రకీర్తితా ।
తద్విభూతయ ఏవాన్యా స్తత్తత్స్థానేషు కీర్తితాః ॥ 73

తా॥ వస్తుతః ఒక్కటియైన దేవత ప్రతిష్ఠాపమందు నొకొక్కనామముచే కీర్తింపబడుచున్నది. వివిధములైన ఆమె విభూతులే ఆయాస్థానములందు కీర్తింపబడినవి.

శ్లో॥ పృథివ్యాత్మా వసురియం శుక్రస్తు వసురమ్మయః ।
అగ్నిరూపో వసుర్భౌమో వాయురూపో వసుర్బుధః ॥ 74

తా॥ ఈమెయే పృథ్వీరూపమైన వసువు. ఆ వసువే జలమయమై (ఆపోరూపమై) శుక్రుడయ్యెను, అగ్నిరూపమై కుజుడయ్యెను, వాయురూపమై బుధుడయ్యెను,

శ్లో॥ స్థిరో వసుర్వియద్రూపో వసుస్సోమాత్మకశ్శశీ ।
ద్యురూపస్తు వసుర్జీవ స్సూర్యరూపో వసుస్త్వసౌ ॥ 75

వియద్రూపమై శనియయ్యెను, సోమాత్మకమై చంద్రుడయ్యెను, ద్యులోకరూపమై గురుడయ్యెను, సూర్యరూపమై సూర్యుడే అయ్యెను. (అష్టవసురూపములివి. స్థానభేదముచే నామభేదము కలిగెను. అసలు కోశరూపత్వము నిచ్చువాడువసువు. 28 శ్లో॥ చూడుడు.)

శ్లో॥ కేచిద్దేవగణాన్భౌమా న్వసూనాచక్షతే విదః ।
మధ్యమస్థా న్దేవగణాన్ రుద్రాంస్తు పరిచక్షతే ॥ 76

తా॥ కొందఱు పండితులు భూమియందు వసించు దేవగణములను వసువులనిరి, మధ్యమస్థాన (చంద్రునియందు వసించు) దేవగణములను రుద్రులనిరి.

శ్లో॥ ఆదిత్యా నుత్తమస్థాన గతాన్ దేవగణాన్ విదుః ।
స్థూలశక్తి మహాభాగ భూయస్త్వాత్ సోక్తి చాతురీ ॥ 77

తా॥ మఱియు, నుత్తమస్థాన (సూర్యునియందు వసించు) దేవగణములనాదిత్యులనిరి. స్థూలశక్తి విభాగమందాధిక్యమునుబట్టి చెప్పిన చమత్కారోక్తియిది.

శ్లో॥ సర్వేషామప్యధిష్ఠానం పరంబ్రహ్మప్రకీర్తితమ్ ।
ఆకాశవత్సర్వగతం తత్తేజ స్సముదాహృతమ్ ॥ 78

తా॥ చరాచరములన్నింటికి పరబ్రహ్మ యధిష్ఠానమని కీర్తించుచున్నారు. ఆకాశమువలెనే ఆ బ్రహ్మమెుక్క తేజస్సు సర్వగతమైయున్నట్లు అధికముగా చెప్పబడును.

శ్లో॥ అస్మాకం హృదయేయచ్చ దేవానాం హృదయేచయత్ ।
యచ్చబింబే భగవతః సూర్యస్యదివిరాజతః ॥ 79

తా॥ ఏబ్రహ్మతేజము మనయొక్క హృదయమందున్నట్లు, దేవతల హృదయమందున్నట్లు, దివియందు ప్రకాశించు సూర్యభగవానుని బింబమందున్నట్లు చెప్పబడునో,

శ్లో॥ యస్మిన్సర్వేవయంచాపి యస్మిన్సర్వే దివౌకసః !
యస్మిన్భాను శ్చంద్రమాశ్చ యస్మిన్నింద్రశ్చపావకః ॥ 80

తా॥ ఏబ్రహ్మతేజమందు మనమందరమే కాక సర్వదేవతలు, సూర్యచంద్రులు, ఇంద్రాగ్నులు కూడ నున్నారో,

శ్లో॥ యస్మిన్వాయుర్మాతరిశ్వా యత్రాకాశో మహానయమ్ ।
యత్రాపో యత్రపృథివీ యస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్ ॥ 81

తా॥ దేనియందు వాయువైన మాతరిశ్వుడునున్నాడో, ఎక్కడ యీగొప్పదైన ఆకాశమున్నదో, ఎక్కడ పృథ్వియు నుదకములు నున్నవో, దేనియందు సర్వము ప్రతిష్ఠితమై యున్నదో.

శ్లో॥ తదేతన్నిర్మలం బ్రహ్మజ్యోతిః పరమమక్షరమ్ ।
తద్విజ్ఞాయ కృతీమర్త్యో భవేన్నాన్యేన హేతునా ॥ 82

తా॥ అదియే పరమము, అక్షరము అనబడు నిర్మలమైన బ్రహ్మజ్యోతి. దానిని తెలిసిన మనుజుడు కృతార్థుడగును. అది తక్క నితర హేతువుచే కృతార్థుడు కాజాలడు.

శ్లో॥ బుద్ధిః పరాచీ సంసారం ప్రవర్తయతి దేహినామ్ ।
బుద్ధిరేవ పరంజ్ఞానం యాప్రతీచీ మనీషిణామ్ ॥ 83

తా॥ దేహధారులకు పరాచీబుద్ధి సంసారము కలిగించుచున్నది. పండితులకెట్టి ప్రతీచీబుద్ధి యుండునో, అది పరమజ్ఞానము బొందించుచున్నది.

శ్లో॥ అహంకారో ద్విధా ప్రాజ్ఞైః శుద్ధోఽశుద్ధ ఇతీర్యతే ।
దేహాది విషయోఽశుద్ధః శుద్ధః స్వాత్మైక గోచరః ॥ 84

తా॥ శుద్ధము, అశుద్ధము అని యహంకారము రెండు విధములుగా నున్నట్లు పండితులు చెప్పుదురు. కేవలము నిజరూప సంబంధమైనది శుద్ధాహంకారము, దేహాదివిషయాత్మకమైనది యశుద్ధాహంకారము.

శ్లో॥ అశుద్ధాధీః పరాచీ స్యాచ్ఛుద్ధా ప్రత్యగ్గతిర్భవేత్ ॥
ప్రతీచ్యా అపరోయోగః ప్రవక్తుం కేనశక్యతే ॥ 85

తా॥ అశుద్ధమైన బుద్ధి పరాచీయగుచున్నది, శుద్ధబుద్ధి ప్రతీచీయగుట వలన ప్రత్యగ్గతిరూపిణియగుచున్నది. ఇతరమేదియులేని (విశ్రాంత) యోగ బుద్ధిని గుఱించి వచించుట కెవరికిశక్యము ?

శ్లో॥ అశుద్ధాహంకృతి ర్మాయా జ్ఞానం శుద్ధాత్వహంకృతిః ।
అన్విష్యాహం కృతేర్మూలం విశుద్ధాహం కృతిర్భవేత్ ॥ 86

తా॥ అశుద్ధాహంకృతి మాయ, శుద్ధాహంకృతి జ్ఞానము అగును. అహంకృతియొక్క మూలము నన్వేషించి తెలియుటవలన నహంకృతి విశుద్ధమైనదగును (అనగా విగతమైనది-లేనిది-యగును) ఇదియే విశ్రాంతస్థితి.

శ్లో॥ దేహాత్మబుద్ధిః యావత్స్యాదస్మాకం దేహధారిణామ్ ।
తావ ద్దాసవదస్మాభిః వర్తితవ్యం పరాత్మని ॥ 87

తా॥ దేహధారులమైన మనకు దేహాత్మబుద్ధి యెంతకాలముండునో అంతకాలము దాసులవలె మనచే పరమాత్మయందు బుద్ధినుంచదగును.

శ్లో॥ యదా ప్రతీచీ దృష్టిః స్యాదస్మాకం తత్త్వదర్శినామ్ ।
తదా దాస్యా న్మహాదుఃఖాద్విముక్తిః సంప్రజాయతే ॥ 88

తా॥ తత్త్వదర్శనమువలన మనకు ప్రతీచీదృష్టి యెప్పుడు కల్గునో అప్పుడు మహాదుఃఖకరమైన ఆదాస్యమునుండి విముక్తి ప్రాప్తించును.

శ్లో॥ పరతంత్రే కుతస్సౌఖ్యం స్వాతంత్ర్యం ముక్తిరుచ్యతే ।
దేహాభిమానమాధూయ స్వతంత్ర స్సుఖవాన్భవేత్ ॥ 89

తా॥ పరతంత్రమందు సౌఖ్యమెక్కడకలదు ? (లేనందున) స్వాతంత్ర్యమును ముక్తియనుచున్నారు దేహాభిమానమును నశింపజేసినప్పుడే స్వతంత్రుడై సుఖవంతుడగును.

శ్లో॥ దేహాభిమానీత్వాశాభిః సర్వతో దూషితాశయః ।
ఆదౌ స్వమనసో దాసః పరేషాం భవితాతతః ॥ 90

తా॥ దేహాభిమానమున్నవాడెల్లప్పుడు నాశలచే దోషభూయిష్ఠమగు నాశయము (జీవితాశయము) కలవాడగును. వాడు తొలుత తన మనస్సుకు దాసుడగును, పిదప నితరుల కగును.

శ్లో॥ మనో యేన జితం తస్య దాస్యదుఃఖం వినశ్యతి ।
అకామస్య కుతః కేన భవితవ్యం మహాత్మనః ॥ 91

ఎవడు మనస్సును జయించునో, వానికి దాస్యదుఃఖము నశించును. కామ్యములేని మహాత్మునకు పొందదగిన దెవని వలన నేముండును ?

శ్లో॥ ఇదం విజ్ఞాయ యచ్ఛాస్త్రం యథోక్త మనుతిష్ఠతి ।
గతభేద స్సలభతే భగవచ్చరణామృతమ్ ॥ 92

తా॥ ఎవడీ శాస్త్రమును దెలిసికొని యథోక్తముగా ననుసరించునో వాడు భేదబుద్ధి తొలగినవాడై భగవచ్చరణామృతమును బొందును.

శ్లో॥ ఋషిభిర్వామదేవాద్యైర్యద్దృష్టం మంత్రదర్శిభిః ।
తస్యశాస్త్రస్య సారోయం మయా సంగృహ్యకీర్తితః ॥ 93

తా॥ మంత్రవేత్తలైన వామదేవాది ఋషులచే నే శాస్త్రము చూడబడెనో, దాని సారమును నేను సంగ్రహముగా వచించితిని.

శ్లో॥ అస్మాభిస్సకలైర్మాన్యో భగవాన్బాదరాయణః ।
యేనార్థవన్తి సూత్రాణి చక్రిరే తత్త్వదర్శినా ॥ 94

తా॥ తత్త్వము దెలిపిన యే వ్యాసునిచే నర్థపుష్టికల సూత్రములు రచింపబడెనో ఆవ్యాసుడు పూజ్యుడు.

శ్లో॥ సచాపి భగవాన్మాన్య శ్శంకరో విదుషాం వరః ।
యేన భేదమతిర్ధూతా జీవాత్మ పరమాత్మనోః ॥ 95

తా॥ ఏశంకరునిచే జీవాత్మ పరమాత్మ విభేదము నిరాకరింపబడెనో, అట్టి విద్వన్మణి మాకు పూజ్యుడు.

శ్లో॥ మాన్యస్స యతిరాజోపి ప్రపత్తిర్యేన దర్శితా ।
విచార్య సకలం శాస్త్రం భక్తానుగ్రహ కామ్యయా ॥ 96

తా॥ ఏమహానుభావుడు సకలశాస్త్రములను విమర్శించి భక్తుల ననుగ్రహించుటకు ప్రపత్తిజూపెనో, యతిరాజైన ఆ రామానుజుడు మాకు పూజ్యుడు.

శ్లో॥ అంశావతారః పవనస్యమాన్యో ।
మధ్వశ్చ మాధ్వీ తులితోక్తి యుక్తః ।
యో భేదవాదం కధయన్నరేషు ।
సర్వోత్తమత్వం స్వవిభువో బభాణ ॥ 97

తా॥ ఏమహానుభావుడు జీవాత్మ పరమాత్మలకు భేదముజూపి, భగవంతుడైన పరమాత్మకు సర్వోత్కృష్టతను జెప్పెనో, మధురవాక్కు గలిగిన వాయ్వవతారమగు నా మధ్వాచార్యుడు మాకు పూజ్యుడు.

శ్లో॥ సచాపి వల్లభాచార్యో మాన్యోబుద్ధిమతాం వరః ।
శుద్ధాద్వైతమతం యేన స్థాపితం ధరణీతలే ॥ 98

తా॥ ఏవల్లభాచార్యునిచే భూమియందు శుద్ధాద్వైతమతము స్థాపింపబడెనో, బుద్ధిమంతుడైన అతడును మాకు పూజ్యుడే.

శ్లో॥ శ్రీకంఠస్సచ సమ్మాన్య స్సర్వాగమ విశారదః ।
యేన శైవమతం భూమ్యాం యోగిశ్లాఘ్యం ప్రవర్తితమ్ ॥ 99

తా॥ ఏ శ్రీకంఠునిచే యోగులచేతను కొని యాడబడు శైవమతము భూమియందు స్థాపింపబడెనో, అట్టి సర్వశాస్త్ర పారంగతుడు గూడ మాకు పూజ్యుడే.

శ్లో॥ బ్రహ్మ దాస్యేన యోగేన జ్ఞానేనచ మనీషిణః ।
అర్చయన్తశ్చిన్తయన్తః ప్రాప్నువన్తీతి మేమతిః ॥ 100

తా॥ దాస్యము వలన, యోగము వలన, జ్ఞానమువలన జనులర్చించుచు, చింతించుచు బ్రహ్మను బొందగల్గు చున్నారు. ఇది నాయభిప్రాయము.

శ్లో॥ వేదాన్సశాస్త్ర శతకాన్ సకలాన్విచార్య ।
ప్రాచామృగాగమదృశాం మతమాదదానః ।
క్షేత్రే ఫణీశ్వరకలా జనితస్య పుంసో ।
ఘంటాశతం గణపతిః కవిరాడకార్షీత్ ॥ 102

తా॥ శాస్త్రశతములతోగూడిన సకలవేదములను విమర్శించి, ప్రాచీనులైన ఋగ్వేద దృష్టిగల ఋషులమతము ననుసరించి, ఆదిశేషుని యంశయైన బలరాముని క్షేత్రమున కవిరాజైన గణపతి యీఘంటాశతకమును రచించెను.

ఇతి శ్రీభగవాన్ మహర్షి రమణాంతేవాసినో వాసిష్ఠస్య నరసింహసూనోః గణపతేరాశుధారాయా ఘంటాశతం తత్వకృతిః

సమాప్తం.

గద్య :— ఇట్లు భగవాన్ శ్రీరమణ మహర్షికంతేవాసియు, వాసిష్ఠ నరసింహశాస్త్రికి పుత్రుడును అగు గణపతిమునిచే నాశువున జెప్పబడిన తత్త్వఘంటాశతకము సమాప్తమైనది.